# వినోదినీ గ్రంథమాల

మూఁడవ కృతి:

'కారకిల్లీ మహోపన్యాసము.



వినోదినీ గ్రంథమాలా కార్యాలయము,
కాకినాడ.

**1939.**

కాపీరైటు రిజిస్టర్డు ]

[ వెల **0-2-0**

**పోషకులు:**

**శ్రీ పావులూరి రామారావుపంతులుగారు,**

**సుప్రసిద్ధ కాంగ్రెస్ వాదులు,**

**గ్రంథాలయ విద్యాపోషకులు,**

**తెనాలి.**


* రచయిత *

మంచికంటి రాజారావు

* ప్రకాశకుడు *

అన్నంభొట్ల సూర్యనారాయణమూర్తి

* ముద్రణము *

శ్రీరామాప్రెస్, కాకినాడ.

* ప్రతులు *

మూడవకూర్పు 1,000


—— ముఖ్యగమనిక. ——

# తొలిపలుకు.

ఈ "కారకిళ్లీ" ప్రహసనమును తొలుత 1923 సం॥లో వేయిప్రతులు ముద్రింపించి ప్రచురించిన కొలదికాలమునకే ప్రతులు తిరిగి కావలసివచ్చినవి. వెంటనే 1924 సం॥ లో తిరిగి రెండు వేలప్రతులు ముద్రింపించిన నెలలోనే యవియు కట్టువైనవి. నాటినుండియు పెక్కురు ప్రతులకొరకై మాకు వ్రాయుచుండియు, నితరావసరకార్య నిమగ్నులమైయున్న మేము తిరిగి ముద్రించుటకు తీరికయు లేకపోయినది. మేము కొంతవరకుపేక్షించిన మాటకూడ నిజము.

మునుపటికంటె గ్రంథము పెంచబడినది. అవసరమగు సవరణలు గావింపబడినవి. ఈగ్రంథమునిప్పుడు మూడవకృతిగా సమర్పించుచున్నాము. షోడశాబ్దముల వెనుకబుట్టినదై యిప్పుడీ గ్రంథమాలారూపమున బునర్జన్మమెత్తిన మా "కారాకిళ్ళీ" నభినందించి, అనుభవించి ఆనందింప గోరుచున్నాము. పాతవస్తువు పథ్యమను (Old is Gold) విషయము రసజ్ఞులగుపాఠక మిత్రులెరుగనిదికాదు.

సంక్రాంతిశెలవుదినములలో ముద్రాలయమువారు ముద్రణమాపినందువలన నీమూడవకృతి ప్రచురణము రవంత ఆలస్యమైనది. మధ్యమధ్య ఎప్పుడెప్పుడేయే కారణములవల్ల కొలది ఆలస్యము గలుగుచున్నను మాకృతులు నెలకు 2 చొ॥ సంవత్సరాంతమునకు 24 కృతులు తప్పక వెలువడును. మాకుస్వంత ముద్రణాలయము లేకపోవుటయే యిందులకు ముఖ్యకారణము. మాసభ్యులఆశీస్సువలనను ఆదరణమువలనను అత్యల్పకాలముననే యీలోపముతీరగలదని ఆశించుచున్నాము.

ఇట్లువిన్నవించు — పబ్లిషర్.

# విన్నపము.

---

మొదటి కృతి "మోడరన్ విద్య" లోనున్న కారము, ఘాటు, రెండవదియగు సిటీమ్యున్సిపలు పంచాంగమున కొంత లోపించినదని మామిత్రులు కొందరు పలుకుచున్నారు. మొదట కారపువస్తువును తినినవాడు వెంటనే మరొక కారమునుతినలేడు. మధ్యచప్పదనమునో, పులుపునో, రుచిచూడవలెను. ఈమూడవకృతియగు "కారకిల్లీ" కి మునుపొక భిన్నరుచిని సమకూర్చుట సమంజసమేయని మరికొందరనుచున్నారు. రెండును నిజమే.

సిటీమున్సిపలు పంచాంగము మాయిరువురి పరోక్షమున ముద్రింపబడినది. మేమప్పుడు 15 దినములు తెనాలిప్రచారమందుంటిమి. మాప్రెస్‌వారు ముద్రింపవలసిన డైరీభాగమంతయు నిల్వయుంచి, అసంపూర్ణముగా గ్రంథమును ముగించుటవలనను, ముద్రించిన సాధారణోపోద్ఘాతమునందైనను తగుసంస్కరణలు గావించుకొనుటకు మాకవకాశము లేనందువలనను, మేము వచ్చుసరికే పుస్తకములు బైండుకాబడి, శేషించిన ప్రధానడైరీభాగమునుచేర్చుటకువీలు లేనందువలనను, ఉన్నదున్నట్లే ప్రచురింపక తప్పినదికాదు. మున్ముందు శేషించిన భాగములోని విషయము లుచితసందర్భమున ఏదేనొకకృతిలో ననుబంధముగా ప్రచురింప ప్రయత్నింతుమని మనవి.

వినోదినీ గ్రంథమాల,
కాకినాడ.

ఎడిటరు అండ్ పబ్లిషరు.

# కారకిల్లీ నవరత్నములు.

---

సీ॥ కస్తూరి సౌగంధి । కప్రిపూర్ణత దిక్కు
లందెల్ల ఘుమఘుమ । వ్యాప్తినొంద
ఇగిత జాజీకోను । లస్వహాసము జనా
కర్షమై సాపూర్ణ । హర్షమొసఁగ
ఘోరపాపాటవి । కుంజరరూపినై
జనులకెల్లరకు మో । క్షంబునొసఁగ
ఘనతర సర్వరో । గములకు సకల లో
కఖ్యాతితోఁ భిష । గ్వరుఁడననఁగ

గీ॥ బాలకృష్ణుని రూపమో! । కాలమేఘ
మో! యనఁగ నీలరూపినై । శ్రీయుతముగ
సర్వజనులను సేవింప । జగతిలోన
శ్రీనివాసిని "కారకి । ల్లిని" నేను.

సీ॥ ఆపూటకుక్షికి । నన్నము లేకుండు
వాఁడైన నన్ మరు । వంగఁబోడు
తండ్రిగతింప గో । దనము మానునుగాని
మనుజుఁ డెప్పుడు నన్ను । మరువఁ బోడు
తనుగన్న తల్లినై । నను దిట్టుఁ గాని నా
తోడ విరోధింపఁ । బోఁ డెవండు

సతిలేని శయ్యపై । శయనింప నేడ్వఁడు
నన్నీడఁగా గోద । నంబానర్చు

గీ॥ దమ్మిడీ లేనివాడైన । ధరణిఁగలఁడు
గాని నన్నీనువాఁడేడఁ । గానరాఁడు
సర్వజనులును సేవింప । జగతిలోన
శ్రీనివాసిని " కారకి । ల్లీని " నేను.

సీ॥ శస్త్రమౌ నిష్ఠుర । సప్రసిద్ధిని మించి
రమణీయమౌ రసా । లమును మించి,
కుసుమాంగి మధురాధ । రసుధారలకు మించి
చిన్ని పూఁదేనియ । కన్న మించి
సురజన భోజ్యమౌ । వరసుధకును మించి
పరిపక్వ ఫలరస । ప్రభను మించి
పలు సుగంధద్రవ్య । పరిమళంబును మించి
నవ్యమౌ కపి వర్ణ । నలకు మించి

గీ॥ షడ్రస స్ఫూర్తినెజగ । త్సార మెత్తిఁగి
దివ్యరూపంబుతోడ వ । ర్థిల్లుచుంటి
సర్వజనులును సేవింప । జగతిలోన
శ్రీనివాసిని " కారకి । ల్లీని " నేను.

సీ॥ నన్ను నోటను బెట్టి । నవ్వుచుండెడువాఁడు
మన్మథాకారుఁడై । మహిని వెలయు

నన్ దంతములమక్ష్య । మాకుంచిగానంబా
నర్చువాడొక నంద । నందనుండె
ముద్దుగా నొకరెంతు । మూతునొక్కులునాకు
దయచేయు వాడొక్క । దైవసముండె
సిగరెట్టు నంకించి । చిరునవ్వుతో నన్ను
నములు నాతేను మహా । నందముగాఁ

గీ। నన్ను సేవించి తలపెట్ట । నెన్నియేని
పనులు నిర్విఘ్నముగ పూర్ణ । ఫలముగలుగు
సర్వజనులును సేవింప । జగతిలోన
శ్రీనివాసిని "కారకి । ల్లీని" నేను

సీ॥ నల్లింజాపిన వాస । నకు మించు "కారకి
ల్లీ" యని కల్లక । ల్పించువారు
కాల్చిన కోడి దు । ర్గంధమా "కారకి
ల్లీ" యని నన్ విస । ర్జించువారు
కుళ్లినపెద్ద వె । ల్లుల్లి ఘాటుకుమించు
"కారకిల్లీ" యన । గడఁగువారు
చచ్చినగండు మూ । ర్జాల దుర్వాసనే
"కారకిల్లీ" యన । గడగువారు

గీ॥ కొందరున్నారు జగతిలో । గుమతులిపుడు
నన్విసర్జించి నిందించి । నారుగాని
సమయమున్నది మునునా । కీర్తిఁజూప
శ్రీనివాసిని "కారకి । ల్లీని" నేను.

సీ॥ ననుఁగూడిగాదె! యీ ♦ నటకులు నాటక
పాకలలో పాట ♦ బాడినారు
ననుగూడిగాదె! యీ ♦ నరులెల్ల సంతసా
బ్ధినిగలనావపై ♦ దేలినారు
ననుగూడికాదె! కాం ♦ తాజనసంఘముల్
సరస భాషల నాడ ♦ జాలినారు
ననుగూడిగాదె! యీ ♦ నాగరికులు సదా
యాంగ్లభాషా ప్రభ ♦ నందినారు

గీ॥ ఇట్టి నాదివ్య లక్షణం ♦ బెంచఁదరమె?
సకలజన మనోరంజనా ♦ శక్తిత్రోడ
దివ్యరూపంబు వ ♦ ర్ధిల్లుచుండ్రి
శ్రీనివాసిని " కారక ♦ శ్రీ " ని నేను

సీ॥ కాప్పింగు లేఁకట్టి ♦ రసికుల తలలకు
నేనులోటును తీర్తు ♦ నిశ్చయముగ
కూనరాగము తీయ ♦ లేనివారలకొఱ్ఱ
లేని లోటును తీర్తు ♦ నిశ్చయముగ
వారకాంతామణిన్ ♦ గోరెడు వారికి
నేను లోటును తీర్తు ♦ నిశ్చయముగ
పాశ్చాత్య విధులను ♦ బాగుగా బోధింప
నేను లోటును తీర్తు ♦ నిశ్చయముగ

తే॥ గీ॥ నిత్యకర్మలనుష్ఠించు ♦ నియమమునకు
నేనులోటుల తీర్తును ♦ నిశ్చయముగ

సర్వజనులును సేవింప ♦ జగతిలోన శ్రీని॥
సీ। ననుఁదినునోటితోఁ ♦ డనె గాయకుఁడు మహా
నందుడై గాన మొ ♦ నర్చుచుండు
ననుఁబట్టు పెదవితోఁ ♦ డనె విటగోష్ఠిస్థ
డలవేశ్యకాంతాధ ♦ రమ్ముఁగోలు
ననుఁదినునోటుతోఁ ♦ డనెసర్వవిద్యల
తృప్తిగా నరులుచ్చ ♦ రించుచుందు
ననునొక్కనట్టి దం ♦ తములతోడనె జనుల్
కోపంబుచే పండ్లు ♦ కొరుకుచుందు
తే। గీ। ఔర! నాదివ్యప్రఖ్యాతి ♦ యన్నిదిశల
వెలుఁగుచున్నది చూడుడు! ♦ వినుడు రండు!
సర్వజనులును సేవింప ♦ జగతిలోన శ్రీని।
సీ॥ నాలోన పాల్గొని ♦ నన్ను రక్షించిన
శ్రీపొగాకుకు నమ ♦ స్కృతశతంబు
నాలోనపాల్గొని ♦ నన్ను బోషించినయట్టి
తైలశ్రేష్ఠమ! నీకు ♦ దండములివె
నాలోనపాల్గొని ♦ నన్ను రక్షించిన
పచ్చిపోకకు శత ♦ వందనములు
నాలోనపాల్గొని ♦ నన్నురక్షించిన
వస్తురాజములకు ♦ వందనములు
తే గీ। తమలపాకులకొక్క ♦ వందనశతంబు
సున్నమునకు జోహారులు ♦ జూపుచుంటి
సర్వజనులునుసేవింప ♦ జగతిలోన
శ్రీనివాసిని "కారకి ♦ ల్లీని" నేను.

# కారకిల్లీ ఉపన్యాసము.

---

సోదరులారా !

నేను కారాకిళ్ళీని. ఈకాలములో నన్నెఱుంగనివారుండబోరు. సర్వవ్యాపకత్వము కల్గుటవల్ల నేను కేవలము విష్ణుసమానస్వరూపిని. విష్ణుమూర్తి దశావతారములెత్తినట్లు నేనును పది యవతారములెత్తితిని. అవతారభేదము గల్గినప్పుడు నాసత్త్వభేదమును ప్రభావభేదమును బొందుచుందును. బరంపురంమసాలా, బొంబాయిమసాలా, లక్నోమసాలా, బెంగుళూరుమసాలా, కాకినాడమసాలా వైజాగుమసాలా, కుంభకోణముమసాలా, మధురమసాలా, మద్రాసుమసాలా, కాశీమసాలా యని నా దశావతార నామములు. సమస్తదేవతలును శ్రీపరమేశ్వరుని భిన్నరూపములైనట్లు ఆదిమైన "కారామసాలా" స్వరూపమైననేను దేశభేదమునుబట్టియు, ఆచారభేదమునుబట్టియు, దశవిధములుగా పరిణమించుచున్నాను. బౌద్ధావతార సిద్ధాంతమువలె జాతిభేదవివక్షతలను పాటింపక కర్మకాండయే ముఖ్యమైనదని యెల్లరకును బోధించుచున్నాను. పృథివ్యప్తేజోవాయురాకాశములును, సత్వరజస్తమోగుణములును, మాయయు, మాయారాహిత్యమును, సంయోగముచేత భగవత్స్వరూపమైనట్లు ప్రత్యక్షసుధాప్రపూర్ణమగు ఘూమపత్రమును, సుపారాముక్కలమును, సోంపును, పచ్చిపోకయు, మఱికొన్ని యితరవస్తువులును సమ్మేళనముతో నాదివ్యస్వరూపమేర్పడుచున్నది. అవతారభేదమునుబట్టి నాయందితరవస్తుభూతములు కలియుచు క్రొత్త క్రొత్త ప్రభావములు కలుగుచుందును.

ఈహిందూదేశములో నేనాడెడి చాటగను, పాడినది పాటగను నామాట వేదాక్షరముగను చెల్లుచున్నది మదరాసు ప్రాంతమున నిద్రపోవునప్పుడు- నిద్రకుపూర్వము- భోజనము తరువాత భోజనమునకు పూర్వము- స్నానసంధ్యలకుపూర్వము- దంతధావనమునకు పూర్వము- యిప్పుడప్పుడనకుండా "కొక్కురోకో"యని తొలికోడి కూసినదిలగాయతు తిరిగి రాత్రి నిద్రపోవువరకు సర్వకాల సర్వావస్థలయందు నన్ను సేవింపక మానరు. దైవప్రార్థనమునకు "త్రోసిరాజ"ని ప్రాతఃకాలమున శంకరా! శంకరా! యని లేచుటకు బదులుగా కారకిల్లీ! కారకిల్లీ! యని లేచి ముందుగా నాదర్శనము చేయుటచే రెండవపనికి పోరు. నేనాంధ్రమండలమునకు వ్యాపించి సుమారు పదిపండ్రెండు వత్సరములైనను సకలాంధ్రజనారాధనను పొందుచు, చాలమందితో సఖ్యముచేయుచున్నాను. నాకు బాగాళా తమలపాకులతో సఖ్యముకుదిరినట్లు మరి దేనితోను జతకుదరక పోయినను కొన్ని కారణములవల్ల నన్నాంధ్రులు ద్రాక్షారామ, సత్యవరం తమలపాకులతో కలిసినను ఊరకుండవలసివచ్చినది. "రాకన్ మానదు పోనివృద్ధులు మహారణ్యంబులో దాగినన్" అనునీతి నేనెరుంగుటవల్ల యేదేశములో యెటువంటి కష్టములు సంప్రాప్తించినను యేలాగో సరిపుచ్చుకొని హిందువులతో సఖ్యము నొసంగుచున్నాను. నాకుగల దినదిన ప్రవర్ధమానత్వము ఈదేశములో మరిదేనికిని లేదని నేను నొక్కి చెప్పగలను. ప్రతిదినమును నేను నూటికి తొంబదిమంది విద్యార్థుల జిహ్వలలోనుందును. నాటకాంత గృహోన్ముఖుల బుగ్గలందు తాండవమాడుచుందును. మిగతావారు నూటికి నలుబదిమందికి

తక్కువగా నన్ను సేవింపనివారు లేరు. నేనాంధ్రజిల్లాలలో మొత్తముమీద సంపూర్ణశక్తిని చూపజాలకున్నను కన్నడము, మలబారు, మదరాసు, లక్నో, గంజాం మున్నగు మండలములలో నూటికి అధమము డెబ్బదిమంది నన్ను సేవింపనివారు లేరు. బహిర్భూమికి వెళ్ళుచున్నప్పుడుకూడా కొందరు మహానుభావులు నన్ను వదలలేక ఆసమయములోకూడా నన్ను నమలుచున్నందుకు నాకు చాలా సంతోషముగానున్నది. భోజనము చేయుచున్నప్పుడుసహితము నన్ను ప్రత్యేకం వకబుగ్గకునొరసి పదార్థములను భుజించుచు మధ్యమధ్య నాకసను మ్రింగుచుండు పురుషోత్తములకు శతసహస్ర వందనములు శుభకార్యములందును, పండుగదినములందును నన్ను క్రొత్తగా జేరదీసి యలవాటులేనివారు నోటబెట్టుసరికి నాఘాటీకాగలేక తల త్రిప్పు-మతిపోవ- కండ్లు తేలవైతురు. ఆపట్టు పట్టు యేలాగునో రెండు మూడు దఫాలు అవుషధప్రాయముగా కండ్లుమూసుకొని మ్రింగినయెడల పిమ్మటవారికి లొంగియుందునే! నాకటాక్షమునకు పాత్రుడైన నరుడు రోజున కధమమూరుసార్లు నన్ను సేవింపక మానడు దానిబరువధను మరతులముండును. నన్ను సేవించువారు వారిజీవితకాలములో నాసఖ్యము మానకుండుటవల్లను ప్రతి రోజును ప్రతిక్షణమును క్రొత్తవారు నాస్నేహము సంపాదించుకొనుటకు దరఖాస్తులు పంపుకొనుటవల్లను, స్త్రీలు కూడా నన్ను వారిభర్తలకన్న నెక్కుడాదరణతో గౌరవించుటవల్లను నేను సగటున నూటికిరువదిమంది నావహించుకొని యున్నాను. ఆప్రకారము లెక్కించగా హిందూదేశములో నొకదినమునకు- నిరువదినాల్గుగంటలకు- సుమారు పదుమూడువేలమణుగుల

కంటె హెచ్చుగాఖర్చగుచున్నాను. మరియు తులము ఖరీదర్ధణా చొప్పున లెక్కించగా రోజునకు సుమారు పందొమ్మిదివేల రూప్యముల వ్యాపారము జరుగుచున్నది. అనగా సంవత్సరమునకు అనేకలక్షల రూపాయలు నాకొరకై భారతీయులు వ్యయపరచుచున్నారు. ఆపూటకు గతిలేనివాడైనను నానిమిత్తమొకయర్ధణా యెవరినైనను ముష్టియెత్తియో, యేస్నేహితుని చొక్కాజేబులోనివైనను దొంగిలించియో నన్ను కొని నన్నారగించకమానడు. బ్రాహ్మణులు తద్దినములు, పర్వదినములలోనైనను తత్కర్మలకు ముందునన్ను నోటబెట్టనిదే స్నానములకైన లేవరు. నాప్రభావము వృద్ధియగు కొలది శ్రీసిగరెట్టు మహారాజునకు పేరు ప్రఖ్యాతులు రాణించుచున్నవి. ప్రతిదుకాణములోను నేను చీనారేకు డబ్బీలలోనో గాజుసీసాలలో నాయనన్యసామాన్య వైభవమును తలచుచు—నాసనము వేసుకొని కూర్చుందును. దేశజనులు నన్ను సేవించుటకు ముఖ్యకారణము వేరొకటిగలదు. నేను ప్రత్యక్ష సరస్వతీ స్వరూపినని వారినమ్మకము. నేనునోటలేనిదే యుపాధ్యాయుడు శిష్యులకు పాఠమును బోధించలేడు. శిష్యుడు తనపాఠముల వల్లింపలేడు. సంగీతజ్ఞుడు గానము చేయలేడు. నటుడు నాట్యమాటలేడు. దైవభక్తుడుభజనచేయలేడు. న్యాయవాది తర్కించలేడు. న్యాయాధికారి తీర్పు చెప్పలేడు. కవికి కవితాధార కలుగదు. నాటకములలో బొల్లి బొల్లి యేడ్పులేడువలేరు. సురా సారాది పానసమర్థుల నోటిదు

ర్వాసనకు నేనే రామబాణమును. విద్యార్థులు తల్లిదండ్రులకు తెలియకుండా కాల్చిన చుట్ట, బీడీ, సిగరెట్టు కంపులను నేనే మాపు దును, విటులకును వేశ్యలకును పరస్పరానురాగాభివృద్ధికి నేనే మూలకారణము. వేయేల ? నేనే నేను. నాతోసరియగు వస్తువు మరియొకటి లేదు. సుగంధద్రవ్యములైన యాలకులు, జాపత్రి, లవంగములు, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు మొదలగునవి చాలకాలమీ దేశమును పరిపాలించినవి కానియిప్పుడు నాధాటికి—నా నిరంకుశాధికారమునకు జడిసి మారుమూల కూలబడినవి. నన్ను నిత్యము సేవించినవారికి దంతపటుత్వ ప్రాబల్యములు కలుగునని నమ్ముచున్నారు. ఆ నమ్మకముతో నైనను నాపాదసేవ చేయుచున్నందుకు వారికి మిక్కిలి కృతజ్ఞత చూపుచున్నాను. నాప్రియమైన పొగాకు చుట్ట చుట్టినమైన కాల్చకూడదనియు; నందులో "నికోటిన్" యనే విషము కలదనియు కొందరు విషయజ్ఞులు పిచ్చి పిచ్చి వేదాంతము లుపదేశించుచున్నారు. కాని చాలామంది బుద్ధిమంతులా యల్పజ్ఞుల మాటలనువినక నాతో పాటు పొగాకునుకూడ నమిలి నమిలి తద్రసము నమృతప్రాయముగా మింగుదురు. పొగాకురసమును గుటకలు వేయుచు మింగిన మహాపురుషులదేకదా మహాసౌఖ్యము! మరియు మహోత్తమ పురుషులు కొందరు ప్రత్యేకము పొగాకును-అథమ మరపపుపొగాకును- తారుకంటె నల్లగానున్న పొగాకును- తలవెంట్రుకల చిక్కువలెనున్న పొగాకును- చచ్చిపోయిన

శ్వాసకూడా లేచిపారిపోవునంతటి ఘాటుగల పొగాకును- అధ
మం గజమున్నర పొడుగుగల పొగాకును- యీనాలైనను తీయ
కుండా జాగ్రత్తగా బొబ్బట్టువలె మడచి పెద్దపులివలె నోరు
తెరచి- యెడమ బుగ్గలో ప్రథమాహ్వాశన కార్యక్రమమువలె-
జాగ్రత్తగా పెట్టి హాయిహాయిగా నొక్కి- పైకిజారిపోయే
యెడల తిరిగి పైకిలేసి మరల అనుకూలముగా పెట్టుకొని- ఆక
సయామాత్రవత్తు గుటకలు వేయుచు- యెవ్వరైనను చూచినయెడల
మేమంతకాలములో అది గపుచిపుగా కాలక్షేపముచేయు పురుష
శేఖరులు మనదేశములో ననేక లక్షలమంది కలరుగదా! ఆ
నికోటా గికోటా వారి నేమియుచేయజాలక దాసోహమ్మన్నదే!

శాస్త్రమసామాన్యముకై మహోత్పత్తికి నాంతెపోతువేమని
పిరాగ వేదాంతయుక్తి యుక్తముగా ప్రశ్నింపవచ్చును. అంతు
లకు మీను యదార్థముగు సంగతి తెలియపరతును. మనలోమన
మాట! యెవ్వరికిని తెలియనీయకండి! ఈ హిందూదేశములో
పాపము వృద్ధియగుచున్నది. సత్యతార్కణమున పాపనివారణా
ర్థమై కలిచక్రవర్తి యన్నిక్ఖడకంపినాడు. శత్రువును సాధించు
టలో మిత్రత్వము వల్లనైనను, శత్రుత్వము వల్లనైనను నెరవేర్చ
వచ్చును. మా కలిచక్రవర్తిగారి యేజంట్లయిన ప్లేగు, కలరా,
ఇన్ఫ్లూయింజా, టయిఫాయిడు, మలేరియా మొదలగునవి
మనుష్యులతో శత్రుత్వమువల్లను కాఫీ, టీ, సిగరట్లు, కల్లు,

సారా, ముఖ్యముగా నేనును మిత్రత్వము వల్లను, మనుష్యు డొనరించు పాపకృత్యములకు గాను- వారి నతమార్చివేసు- వారిని రూపుమాప- యీభరత భూమికి దుర్భరమైనవారి భారమును తొలగింప- దేశాభిమాన విహీనుల రక్తమును నాకను పారద్రాగి- పాటుపడుచుంటిమి. అమితమగు పైత్యపువేడియేనా మహాత్మ్యము. యిప్పటికి సగటున సంవత్సరము వక్కంటికి హిందూదేశములో వేలకొలది జనులను నాపొట్టను పెట్టుకొనుచున్నాను. నాసంయోగమునకు- నా మహాదరణమునకు- నా యనన్యసామాన్య వ్యామోహనాకూపావ లోకనమునకు- మహాపాపజనులే పాత్రులగుదురు. సద్భాచారసద్గుణ నిరంతరులను, దేశభక్తులను చూచినప్పుడు గడగడ వణకి ప్రక్క కొత్తిగిలెదను! గోదావరీ ప్రవాహము క్రమక్రమముగా నోడ్డును కూల్చివేయునట్లు- నేను నన్నాశ్రయించిన వారలను తడిగుడ్డలతో గొంతులు కోయుదును. నాప్రభావమువల్లకల్గిన పైత్యపువేడిచేత నిప్పుడిరువదేండ్ల ప్రాయమగుసరికి- కంటిదృష్టి తగ్గిపోయి- చత్వారమురాగా స్పెన్సరు కంపెనీనుండి స్పెక్టికల్సు తెప్పించవలసినదే! నన్ను నముఁటవల్ల నారసము గొంతుకు గూడా గుండెలగుండా కడుపులో ప్రవేశించి రక్తనాళములను జీర్ణకోశములను క్రమముగా పాడుచేసి క్రమక్రమముగా గుండెలావ్పుకొని పోవ- నేత్రదృష్టి క్షీణింప- రక్తముచెడి- రక్తము విరిగి హృదయకోశము పనిచేయలేక కాళ్లుచేతులు చల్లపడ-

కొంతసేపటి కాజీవుడు యమ్మలోక ప్రయాణోన్ముఖుండగును. ఇదిమాత్రము నిజమని నిశ్చయముగా నమ్మవలెను. ఇప్పటికే చాలా ఆలస్యమయినది. అప్పుడే నాకొరకు చాలామంది పరితపిస్తూ నాకొరకు దుకాణములన్నీ వెదకుకొనుచు బెంగపెట్టుకొనుచున్నారు. నేనుత్వరగావెళ్ళి వారిహృదయములలోపడాలి —

నాభక్తులకుజై!

తే॥ గీ॥ రైయి రైయని తలదిప్పి ॥ రాత్రులందు
నిదపోనీక పీడింతు ॥ నిశ్చయముగ
ధరపిశాచమై నేబట్టి ॥ దను నరులను
శ్రీనివాసిని "కారకి ॥ ల్లీని" నేను.

శ్రీ భరతఖండాంతర్గతాంధ్రద్రవిడకర్ణాటక వంగకాళింగాది వివిధ
దేశ జనారాధిత- ప్రతినిత్యాహోరాత్రి స్త్రీపురుష బాల
బాలికా జిహ్వాలంకృత- నిరుపమాన నిషాహుపారు
పరిపూర్ణ గంజాం మండలో ద్భూతాఖండ నిరంకు
శాధికారవై భవోపేతా నంతకోటిసోడా సిగ
రెట్టాది వ్యాపారస్థాన నివాసితంబైన
సకలకార్యకలాపదిగ్విజయ ప్రదా
యినియగు కారాకిల్లీ స్వకపోల
కల్పితమగు ఆత్మకథా
ప్రబోధకంబగు
మహోపన్యాసము సంపూర్ణము.

---

# కారకిల్లీ దండకము.

---

శ్రీకారకిల్లీ! జగత్కల్పవల్లీ! నను న్నిత్య మానందవారాశి దేలించి పోషించుతల్లీ! భవత్పాదపద్మంబులన్ భక్తితో శ్రద్ధతో దీక్షతో కూర్మితో ప్రేమతో సర్వదా గొల్చెదన్! ఆశ్రితానేక కల్పద్రుమంబౌ భవద్దివ్యచారిత్రమున్ సంధ్యలన్ రాత్రులన్ మిట్టమధ్యాహ్న కాలంబులన్ సర్వదామోద చిత్తంబుతోడన్ దలంపన్ స్మరింపన్ జపింపన్ పఠింపన్ రచింపన్ నుతింపన్ మహాకౌతుక స్వాంతముప్పొంగునో దివ్యశక్తీ! విశేషానురక్తి ప్రపూర్ణుండనీకున్ గృతజ్ఞుండ నీచేతిలో కీలుబొమ్మ స్వరూపుండ నన్నున్ గటాక్షించి రక్షించుమో ప్రేయసీ! సర్వలోక ప్రభాసీ! జనశ్రేష్ఠ జిహ్వాగ్రవాసీ! నిక్కమ్మిదే నేనొక్కరోజైన పూటైన గంటైన జీవింపగాలేను నీసేవలో తన్మయత్వంబు నూహించు నాకేలయిల్లాలు? నాకేల సంతానచింతా నిమగ్నంబు? నాకేల సర్వస్వమున్? సర్వమున్నీవె! యత్యద్భుతాధిక్యమానీ నిజాశక్తిచే నన్నికష్టంబులున్ సర్వదుఃఖంబులున్ నిత్యతాపత్రయాంతర్గతః క్లేశముల్ నాశనంబై, మహానంద సంధాన ముంగూర్చు నోకారకిల్లీ పవిత్రాంకురీ! నీమహత్త్వంబు వర్ణింపగా శక్తిలేకున్న నీదాప్రభావంబె నాచేత నీదండకంబున్

రచింపించె దీనిం బఠింపన్, లిఖింపన్ వినం గోరువారల్ సదా పుణ్య
వంతుల్ సదా కీర్తివంతుల్ మహానందమూర్తుల్, మహాదోష
విధ్వంసవర్తుల్ గదా! లోకకల్యాణదాయీ! హుషారుప్రదాయీ!
భవద్దివ్య మాహాత్మ్యముం గాదె! విద్యార్థిబృందంబు డిగ్రీలనా
ర్జింప- క్రీడర్లు వాదించి డిక్రీలు జేయింప- నాట్యాంగనల్ దీక్షతో
డ్యాన్సులం జేసి రంజింప- టీచర్లు రోజంతయున్ వాగి బోధింప
డ్రామా సినీమాలయాక్టర్లు ధైర్యంబుతో నిల్చి యుత్సాహ
ప్రోత్సాహులై యాటలన్ పాటలన్ మాటలన్ మెప్పులం
బొంద- డ్రైవర్లు మోటారులన్ జాకచక్యంబుతో డ్రైవు జేయంగ
వేశ్యాంగనల్ మేళముల్ తాళముల్ రాత్రులన్ మిట్టమధ్యా
హ్నమున్ భేదముల్లేక యూరేగి స భావశల్ బొంక- యుద్యోగ
బృందంబుచే వారిమ్యాటీల జేయింప నీకృత్యముల్ వేనవేల్లక్షు
లున్ లోకమందన్ని పట్నంబులున్ సర్వగ్రామంబులున్ పూరు
షుల్ కాంతలున్ జాతివర్ణంబులన్ పక్షపాతంబు లేక న్విలోకింతు
వో కారాకిల్లీ విచిత్రాంగి! యస్మన్మనః క్లేశసాక్షాత్కరంగీ!
నినుం బొందకే రామచంద్రుండు ఘోరాటవుల్ సంచరించెన్!
నినుం జూడకే పాండురాట్పుత్రు లజ్ఞాతవాసంబు గావించిరే!
నిన్ను యోగీంద్రులున్ మానులున్ దేవతల్ గాంచగాలేక
నూరేండ్లు వేయేండ్లు గ్రీష్మప్రతాపాగ్నిలో నంధకారంబులో

మంచులో కుంభవర్షంబులో నన్దపంబుల్ మనోనిశ్చలత్వంబులో దీక్షతో జేసిరే! వారి నిర్భాగ్యతన్నీదు దివ్యాకృతీ దర్శనంబైనకాలేదు నాదే మహాదృష్టమంచున్ దలంతున్ నుతింతున్ భవన్మైత్రియే నాకు సర్వస్వమున్ నీదు సంబంధ బాంధవ్యమే నాకు పూర్ణాయురారోగ్య సంపత్ప్రవృద్ధి ప్రదంబై చెలంగున్ మెలంగున్ ననుం బ్రోవుమో కారాకిల్లీ మహాశక్తిరూపీ! చిరంజీవ! యంచున్ నమస్కార లక్షల్సమర్పింతు నాజిహ్వపై సర్వదానిల్చి రక్షించు దేవీ! నమస్తే! జగద్వ్యాపకారీ! నమస్తే! నిషాపూర్ణ ధారీ! నమస్తే! భజే! కారకిల్లీ! నమస్తే! నమస్తే! నమః!

సంపూర్ణము.

